శ్రీరస్తు.

శ్రీ లక్ష్మీనరసింహస్వామినే నమః.




# ప్రహ్లాదచరిత్రము

అను

శ్రీ నృసింహావతార వర్ణనము

కీర్తనలు.

ఇత్యాది,

శ్రీ కాళహస్తినగర వాస్తవ్యులును నాయుర్వేద

విద్యా పారంగతులును నగు

## సురభి-లక్ష్మీనరసయ్యగారిచే

కార్వేటినగర శ్రీభారతీ విలాసవన ముద్రాక్షర

శాలయందు ముద్రింపంబడి

ప్రకటింపఁబడెను.

1920

గలపడవచ్చు. ఇంకేమి చేయుదమాయని తలపోయుచు నారేయి నెల్లయు చింతాపరవశుండై మైమఱచియుండ స్వప్నమందు శ్రీనృసింహమూర్తి ప్రత్యక్షమై "నీభక్తికిమెచ్చి నీయింటనుండగోరితిని. నావల నభయము నొందుము. నీకు శుభము లొనకూర్తుగాక. నన్నిటులనే నీయింటఁబూజించుచుండుమని" స్వామియంతర్ధానంబు నొందె. రామన్నగారి సంతోష మెంతని చెప్పతరము? అత్యంత వైభవముతో శ్రీనృసింహవిగ్రహమును స్వగృహమునకుం గొంపోయి- యభ్యుదయములందుచు, నిరతంబా శాలగ్రామమునకును శ్రీనృసింహవిగ్రహమునకునుఁ బూజలు సేయుచు సుఖంబుగనుండె.

రామన్నగారి కుమారులు అప్పన్నగారు. ఈ అప్పన్నగారినే లక్ష్మీనృసింహయ్య యనియు పిలుచుచుండిరి. భక్తి శ్రద్ధలయందీతఁడు తండ్రియంతటివాఁడే యగుటంజేసి శ్రీలక్ష్మీనృసింహుని కులదైవముగ పాటించి- యక్కమలాక్షుని పూజలందే కాలము గడుపుచుండె,

అట్టితరి శ్రీకాళహస్తి- జమీన్దారులోబడిన పామూరుకరణముగారిపను మనుఁడై శతఘంటం రామస్వామి అనునొక విప్రోత్తముఁడు ప్రభువుల సందర్శింప వచ్చియున్నెడ అప్పన్నగారి చెలిమిబలము సంపాదించి యుండెను- రామస్వామిగారాతనిని భాగవత సప్తమ స్కంధమును కీర్తనలుగా రచియించి యివ్వగోరగానతఁడునట్లేయని కీర్తనలు గొన్ని రచియించి అప్పన్నగారికొసఁగిరి. కీర్తనలు హనుమదాంకితములై విలసిల్లుచున్నది.

ఈకీర్తనలను నిరంతరంబు పాడుచు నప్పన్నగారు కమలాక్షుని పాదారవిందములఁజేరిరి- వీరికొనుకటి వారంపరను నృసింహదేవుని

గొలచువారలనుటకు శ్రీ వముద్రితమైయుండు వంశవృక్షమను గప్పడు నామములే సాక్ష్యమిచ్చుచున్నది.

అప్పన్నగారి కుమారులలో చిన్నవారగు చిన్నికృష్ణయ్యగారి కీర్తనలు తాళపత్రంబులనుండి నచ్చువేయించి ప్రచురింప బ్రయత్నించెను గాని వారికిసమయముచే కూరదయ్యె.

వీరికుమారులిప్పుడీ గ్రంథమును ముద్రింపించుటకు ప్రయత్నపడి శ్రీకార్వేటినగరం శ్రీభారతీ విలాసవన ముద్రాక్షర శాలాధికారుల సాహాయ్యంబునను కార్వేటినగర వాస్తవ్యులగు కొందరుమిత్రులు లేఖనిక ప్రమాదాది దోషంబులు లేకుండునటుల సవరించి తోడ్పడినందుచేతను ప్రయత్నము కొనసాగగలిగినది గానవారి కెంతేయు కృతజ్ఞులము.

శ్రీ [illegible]మూర్తి యీసురభివారి సంతతిని నిరంతరాయముగా ఆయురారోగ్యైశ్వర్యములతోడ రక్షించుగాక.

ఇట్లు విన్నవించు విధేయులు.

సు. అప్పయ్య.
సు. నరసయ్య.
సు. శంకరయ్య.
సు. కైలాసయ్య.
సు. లక్ష్మీనరసయ్య.



# శ్రీ లక్ష్మీనృసింహాయనమః.

సురభి రామన్న.

లక్ష్మీనరసయ్య అను అప్పయ్య.

వెంకటకృష్ణయ్య.




ఈకుటుంబమునకు. శ్రీనృసింహమూర్తి ఆయురారోగ్య ఐశ్వర్యములు నొసంగిరక్షించుగాక.

  



శ్రీరస్తు.

నృసింహాయనమః.



శ్రీమద్వేదాంత వాక్యాంత నానటత్పదపంకజం।
గజాననమహం వందే గజాజినధరాత్మజం।
శ్రీమారుతం సతతం శాంతం నితాంతం నమతాంగతిం।
ధృతిమంతం వికస్వంతం హనూమంతం నమామ్యహం॥

ఘంటారాగం ఆదితాళము

గజవదనుని దలతు। సదా శ్రీగణనాథుని దలతు। గజవదనుని దలతు నిజపాద యుగంబు భజియించు జనములకేపనులు సిద్ధిజేయు॥ గజ॥ పరమ పవిత్రుని। ఫణియజ్ఞ సూత్రుని। సుందిర గాత్రుని। శుభమిత్రుని। సరస చారిత్రుని। సన్నుత పాత్రుని। పవిహృతశత్రుని పార్వతీ పుత్రుని॥ గజ॥ ఈషణత్రయ విశోషణు పన్నగ భూషణు మంజుల భాషణు। దోషనిర్భంజను దంతివిమోదను మూషకవాహుని మునిజనపాలుని॥ గజ॥ అతిశుభకరములు। హనుమద్వర ప్రదాంకితములు। నరసింహకీర్తనలు। ప్రీతియందు మిగుల ప్రసిద్ధిగ నొనరించు। శతఘంటకవి రామస్వామిని రక్షించు॥ గజ॥

## సౌరాష్ట్రరాగం త్రిపుటతాళం

శరణు శ్రీనరసింహ విగ్రహ। శరణు భక్తానుగ్రహ। శరణు దుష్టాగ్రహవినిగ్రహ। శరణు సద్గుణసంగ్రహ। ఆదిదేవమునీంద్ర వందిత। అఖిల సురగణసేవిత। దానవాంతక దీనబాంధవ దానకల్పక మాధవా ॥శర॥ నిన్ను నిమిషము కన్నజనులకు కన్నులున్న ఫలంబు గా। విన్నవించెద నీదుకీర్తన విన్నవీనుల ఫలముగా ॥శర॥ సలలితప్రహ్లాదభాషణసకలకలుషవిశోషణా। లలితమణిమయదివ్యభూషణకలితహనుమత్పోషణ ॥శర॥ 2

## సౌరాష్ట్రరాగం త్రిపుటతాళం

శోభనమే శ్రీనరహరికి। శోభనమే సుందరహరికి। శోభనమే మమ్మేలు మురారికి। శోభనమే శ్రీశౌరికిని ॥శోభ॥ ఫెళఫెళ స్తంభము భేదించి వెలిగి హిరణ్యకశిపు ద్రుంచి। తొంగ గని। ప్రహ్లాదుఁ గరుణించి। వెలసిన శ్రీ వేదవేద్యునకు ॥శోభ॥ తరుణతరానన। చరణునకు। నిరుపమదివ్యాభరణునకు। శరణాగత జనభరణ పరాయణ। కరుణారస విస్ఫురణునకు ॥ మించిన వేడుక గాంచుచును। అంచితరీతినటించుచును। చెంచు చెలులవలపించి। రతులగావించిన। శ్రీనరసింహునకు ॥శోభ॥ పాలితసురమునిజాలునకు। లాలితకాంచనచేలునకు। బాలహనూమత్పాలనఁ జేసిన శ్రీలక్ష్మీనరసింహునకు। శోభనమే। 3

## సౌరాష్ట్ర రాగం ఏకతాళం

మహాలక్ష్మి దేవికి మంగళం ॥ మహనీయ మూర్తికి మంగ
ళం । శ్రీమహాలక్ష్మి దేవికి మంగళం ॥ రమణీమాతల్లికి । రాజీ
వగంధికి । మముగన్నతల్లికి మంగళం ॥ శ్రీమహాలక్ష్మి ॥

కంజాత పాణికి । ఘననీల వేణికి । మంజులవాణికి మంగళం॥
శ్రీహనుమద్వరదునకు । మననారాసింహునకు । మనసైనా చె
లువకు। మంగళం ॥ శ్రీమహాలక్ష్మి దేవికి మంగళం॥ ౪



శ్రీనృసింహాయనమః

శ్రీమంతం సతతం శాంతం। నితాంతం సమతాంగతం॥
ధృతిమంతం వితన్వంతం। హనూమంతం నమామ్యహం॥

ఆదితాళం॥ పదము॥

శ్రీహరిసుగుణములు విన్నవారికి। చెలగుకల్యాణములు॥ శాహజచంద్రుడా। పరీక్షిన్నరేంద్రుడు। మోహనిరసన వచనశుకశుక। మునిసింగనుగొని వినవినుమనె॥ శ్రీహరి॥

ఘనముగనొకకథ। వినవలెనిక సుధ। నేనయుగవివరింతుమీ। నామనఃకమలము చేట్కాదనరింతుమీ। కల్మషజాలములు ముసుచ లతొలగింపుమీ॥ దేహము పావనముగ నొనరింతుమీ। దం శాలమణియనుతను వేదశాఖినాను। మునివిభాండనయమను నెసరునను। మననమునను చెనగొనగననియును॥ శ్రీహరి॥

దిక్కులెల్ల దమంట యెక్కువ గర్వించి। మిక్కుటముగ మించి। దేవగణముల। త్రిక్కుక బాధించి। తెగుకనక కశిపుడు। గ్రక్కునవిదళించి। వానికొమారుని మక్కువకరుణించి బ్రోచిన వరహరిచొక్కమగుకథబూని। సొక్కుతునని ముని। చక్కెరల యకెరలవలెరుచు। లెక్కగను చక్కగను పలికెను॥ శ్రీహ॥

కరుణాకటాక్ష। భాస్వర రామస్వామి శుభకరహితనుతిమం

తుని। మేరుమందరాధరనిభ। ధృతిమంతుని। అక్షరాక్షసాసర
సిజహేమంతుని। కవిజనాధార। వరవీరహనుమంతుని। పాల
నసేయు। గురువర వందిత చరణుః శౌరి । చరణకమలస్మర
ణసలుపుచు। సరసయతికులతిలకుడౌటులనె ॥శ్రీహరి॥

జంపెతాళం। ఆనందభైరవి

వినుము భూవరచంద్ర। విమల గుణసాంద్ర। జపవినుత
యీకథను। సావధానముగా ॥కనక నేత్రాగ్రజుడు। ఘనత
మారేండ్లుగణించి। ముసువిరించిగురించి। మునివృత్తినించి।
తెనరిమందరశైల। మున తపంబొనరించి। అనఘ వరముల
గాంచి। మొనరగర్వించి ॥విను॥ పరమాత్ముడైనట్టి హరి
పైవలపుబట్టి। వరమునులతలమొట్టి। ధరణిబడగొట్టి। సుర
సుందరులబట్టిచెరలలోపలబెట్టి। సురలదూరముసెట్టి। మెరసె
దితిపట్టి॥ విను ॥ దనుజేశ్వరునిధాక। తగిలియోర్వగరాక।
మునసిసిఖిలాలోక। ములనుండలేక। హనుమద్వరదుడైనా।
కలివిహరుతుడౌగాక। యనుచువేల్పులమూక జనెనతనివాక
॥ విను ॥ ౬

మధ్యమావతిరాగం- ఆదితాళం

వినుమీ శ్రీరాజశేఖర। వినరణమందార। వినుతిసేయు శతముఖ
ముఖసురలిటు॥ వెతలి పాలకడలి కడచనిర్బరి ॥వినుము॥ నిజాల

యుంచెదవీ । బడలిక (నిండెయొడలు సడలి । పొగడిరి। భజామ
హేత్వాం ప్రభజామ హోశమగజామ హేష్టందభజా మహేనిశం
॥ వి॥ దయాంబునిధిమౌనీ । భక్తజనహృదయాంబుజాకరణయనీ।
సురసభ । నయుంబుతో నిటు । వనతుంబుకడు । భయంబో
సగు। రిపుభయంబుడుపుమనె॥ విను॥ సుపర్వులిటు బూని। వేడి
నజూచి గగనవాణి। దనుజుడ కృపాళుడై తనయు పాల।నలిగిన
నపాయమొందెద॥ నుపాయమునన నై॥విను॥ చరాచరాత్మకుసీ।
హనుమద్వర ప్రవాయకుని మాటలు విరానజైపజపగానెరా
ముదంబునవిరాళిం చెందకసురాళిజనెనిది ॥ వినుమీ॥ ౭

## సావేరిరాగము-ఖండజాతి-అటతాళము.

రాజాధిరాజమౌళి-హరిలీలవినుమి- భాగ్యజమానసద్గుణపాళీ॥
యీజగమున। రాజిల్లు దనుజ-రాజునకును-గలరునలుగురు సు
నూజులందు శ్రీహరిపదపాథోజపరుండు। ప్రహ్లాదుండనగ-
మించెను॥ రాజాధి॥ సాదరముగ వేదాంతవచో-వాదము మో
దమునను మదిలో। గాంచి వినోదముగా దెంగ- ఖేదము
జెందకనూ। భేదము దనుజెంచలపకనఘవి- భేదముజేయుచు
హరిభజనాహ్లాదుడు మేదినిలో నా ప్ర-హ్లాదుడు భక్తశిఖామణి
యనంగదనరెను॥ రాజాధి॥ అంచితముగ పంచేంద్రియముల।
వడంచి పరాంగనలను గాంచిన। గాంచినవారంచు దలచుచు-

వంచనతెంచక నూ| కాంచన వసనమయాంబరచు-ప్రపంచము

తనమనమునభా । వించునసత్యము కలనైనా - యించుకవచి

యించడతండతులితమతి॥ రాజాధి ॥ శాంతుఁడు విలసత్కీర్తి

యుతా శాంతుఁడుసుగుణ ఖశాంతుడువి- శ్రాంతుఁడధికదాం

తుడనివిను|తింతురుసురులంతటనూ| మెంతసిడెలుపుదునతసిని

ఫణి-కాంతునకునుగురునకు భాషా- కాంతునకునుహారునకును

హానూ- మంతునకైనని తాంతముపొగడతరమ ।రాజా॥ ౯

కాఫిరాగం- ఆదితాళం

వినుముఘనము నృప-నరహరిచరితము । విపులపుణ్యయు

తము ॥ దనుజుఁ డాత్మజుని ఘనముఁగోరెనన । వినియు ధర్మసు

తుఁ-డని మౌ మునినిగని ।సురుచిర సురమానీ-నారద-ధరణి నె

వ్వరేని ।పుత్రుబు-సిరధిమతముబూనీ- నేర్చిన- నేరకున్నగానీ-

సైచెద-రరుదుగాన ! దీనీ-తెలుపవె-యనుచుస్వామిజానీ । వే

డెన-పరమహర్షవిస్ఫురణ మొందుచును పరమహర్షియును

బలికెనీక్రియను ॥ విను ॥ ౧ ॥ తనయుబిలువు మంచు । దితిసు

తు-డవినను జనుడెంచు। కొమరుని- గనినిను చదివించూ వేడుక-

నొనరింతు కరించు ।చదువని- మనుజుడఙ్ఞుఁడంచూ - చదివిన

జనుడు ప్రాఙ్ఞుఁడంచు। జనులి-ట్లనుదురంచు చండామార్కు

లకును ॥ ఘనుఁడు శిష్యుగను నని చెనంటెటవు ॥ విను ॥ ౨ ॥ గురు

ముతులికీర్తి-యుతుని-గొనిచనెఘనకీర్తి । శాస్త్రము-గరప విని
మహత్ప్రీతి।రమ్మని గాంధిసు రారాతి- యడిగిన-హరిగుణవిఖ్యాతి।
తెలిసితి-ననుచును-నిర్భీతి । సుతుడన- మరవి నారు హనుమ
ద్వరకథలని । మరలబని చె మతిమంతుఁ జేయుఁడని ॥ విను । ౩

శంకరాభరణం- ఆదితాళం

వినవలెను- పుణ్యముగా కొనవలెను- దనుజుల గురుపులం
తట వానికొని జనించెను జనపాలశేఖర । వినగనిరతము
ప్రమదభరితము విహిత దురితము-నృహరి చరితము ॥ విన ॥౧
వారలు శాస్త్రవిలాసములను । వానికి విద్యాభ్యాసముచేసి
యారూఢి మాకిక మోసము లేదని దనుజేంద్రుని వాసముచేర
దీరిత తోడుత దెచ్చిరి సంసార । ధార విముక్తుని భగవద్భ
క్తుని । దానతర సుఖవిరక్తుని । సత్యయుక్తుని పరమ ముక్తుని
॥ విన ॥ అన్నదూమాట లాలించుమీ । అల వెన్నుని కథ చా
లించుమీ విద్య లెన్నోయు చదివించుమీ । అని-కన్నతండ్రికి
విన్నవించుమీ-అని- యున్నతో చండామార్కులు బల్కిన ।
యొన్నకనతడును విన్నకజనుచును-కొన్నివేళలనక నడుగడు
గునకు మాధవ యాపెను మాధవ ॥ విన ॥ ౨ ॥ అడరుచు మదిని
దలంచుచూ । వీరహనుమద్వరుని తలించుచూ ।గల్లి-జాడిన
తోడవులను మించుచూ । వచ్చి-పడిపడి మొక్కి-నగాంచుచూ-

తండ్రి-కడువడితనపట్టినపుడు చేతనపట్టి । గొడమీదనుంచెను-
తొడపైకెడించెను-కడగి ప్రియముల గారవించెను- కౌగలించెను
పలుకరించెను ॥ వినవలెనే । పుణ్యముగైకొన వలెనే ॥ ౩।౧౦

## భైరవిరాగం - ఆదితాళం

దీనలోకచింతామణి నృపమణి। దీనివినుము సుగుణి। మాంధా
తనుడంతట కొమరుని। సుమతతో గనిపించిన పద్యము జ్ఞాన
రీతి తాత్పర్యము చెప్పుము। సానుకూలముగ ననంగనతండును।
బూనిన వినరూన। దనరి ౧వ నమున।హొదవిన ముదమున। నిటులని
బలికెను। దీన। ధీరులైచదివించిరిగురువులు। ఘోరిశాస్త్రములను
దెలిపెదను చేరివినగవలెను। కర్పూరతతో డభీకరావహ। దనుజ
మదను। సారమైనకథయా। వసుగనమీరుకర్ణ సుఘను। కోరిక
మీర।గోప్యము త్రికరణగణవిశుద్ధునవవిధభక్తుల సారె సారె
కను। హరిపరిచర్యల। మేరమీరి। యొనర జేయుమనుజుండు
జేరును। నిహమును। పరమును। మెరయును। శిరిగను నరులు
ను। సురలునుతింపను ॥ దీన ॥ ౧॥ మంధరావనిధరధరు పూ
జలు। నొందుకరము కరము। హా। వినుతి జెందు శిరము శిర
ము। చాలముకుందనామ కీర్తనముల। ప్రమదము నందు దిన
ము దినము। మురహరుని జూచెడు మనము మనము। నిం
దనిత్యము। గాదిది తెలియుము నిజము। శ్రీహరి పదారవిం

ఖండమదద్విప శాండమను । డీకొల్పుచు నుద్దండముగను మేల్ ।
చండులతలెబల్ । కొండగముల్ । చెండుచుపయి మెండుగని ।
జినకాండధి జలమండలిలో । నుండగనెడు రెండలనొరతన
యుండనకను దండన చేసిరి ॥ ఈకథ ॥ ౨ ॥ శ్రీరమణీ ధారణద
నజని । దారణభూరిజగ । శాౄరణసుమన । స్ఫారణ।
సుమశ్చరణసం । చారణవననారణ భయము విని। వారణముని।
పాలెను త్రైత్యారి సతదు । మీరుచుపొగడగ । వారలువిని ధీర
తచెనకరి ॥ ఈకథ ॥ దిట్టతనంబుట్టి పడందల । పట్టియువడి ।
కట్టులుకక్ । దిట్టనగదలక్ । గొట్టినతెతలక్ । బెట్టపడక్ । నె
ట్టినవవి । గెట్టిగవతనికి । పట్టుగుహరి కట్టియెడక్ । నెట్టవకృప
బుట్టినదవ్వటను । జెట్టివఫల మట్టులదోచెను ॥ యీకథ ॥ ౪ ॥
చందురు చెల్వం దినవదనము । కందవు మెయి కందదుసం।
క్రందనరిపు । రాణ్ణందనుడవిరా । మందులనక్ । జెందడేది ము
కుందుని మహిమని । యెందరుబెగ । డొందిరదె। మందుపవన
నందనువరకృప । బొందినజను డొందడె సుఖముల ॥ ఈ ॥౫

## అసావేరిరాగం- ఆదితాళం.

నరవరవిను శ్రీవరహరిచరితము। నవసుధాభరితము। హరి
యుతనయురూపుమాపలేకను। సురవిరోధి మదినిభేదమొం
దెను॥నరవరి॥ జలనిధి జలములలోపల ముంచిరి॥ జ్వాలలెగ

దరాంగికి నందనుడుద్భవ। మందుపురందర నీశేశ్రమపడ। దిం
దిరాధిప పదాంబుజ భజనుడ। వందివస్వత్రివిడుపుసుందరినః॥
కొండలములనంచి। సీతాశ్రమ మందుపొందు పలుచీమిగులం।
మందమైన హనుమద్వరతత్వము మానినను గూర్చిచెప్పె నసె
సిడి॥ చేరివిను॥ ౧౪

### కేదారి గౌళ - ఆదితాళం

రాజస్యచంద్రచంద్ర చంద్రవిరాజిత కీర్తిపొందా॥ తేజమలర ప్రస్తుదుడుబల్కెను। దేవతాస్వరూపంబగు కాలముతో జనినధరణీరుహాఫల। మెజననముఖ్య షడ్వికార। భాజనమగుచూ। వెంశివగతి। కాయమునకును। గానియాత్మకు। జనుపైపడవు జననమరణాదులాత్మ పరాత్పరుడునిత్యుడనిమెనినుమది॥ రాజన్య॥ భూమిలోకపక సైకతంబున। భూరివహ్నియోగంబున। తగ। హేమకారకుండు పాటవంబున। హేమమొందిన విధంబున। కామమోహపాశాది గణంబున కదుస్పృక్కక జగంబున। నభిరామముగ మోక్షమునగను బాలకు। లారావినుడు ముదంబున। వేమరు త్రిగుణమ్మెల నెనిమిదియైన ప్రకృతులోగిన పదారుగు। వికృతుల నీయురువదియేడిటనగు। చరాచర శరీరయుగ మాత్మకైనె॥ రా॥ ౧॥
ధీరుడాత్మ నిరవస్థుని గాగను। తెలియుట దన్వితుడైనను। వి

స్తో కుసుమధర్మ గంధములను। మారుతమునరీన రీతిగనూ।
కోరిబుద్ధిభేదములనుమరిగను। గోనవలయును। పరమాత్మను।
పలు।మూఢునవ విధభక్తి పథములను। మీరి నరుడు ఘనంబు
గను। శ్రీగమణహరె వరద వరిదయాసింధో నరసారథేయని। చె
లగుచు నాడుచు।వివశుడగుచుతుద। నమోఘసుఖపదవిబొందు
నని చెను॥రాజ॥మెండుగా సకలజీవకోటిని,నిండియుగగనము
ధాటిని।హరిమయుండు గనక విషయంబులతోటిని।యుక్తి నెసం
గినవాటిని। దంశియజ్ఞములనుండెడపీటిని। తగనసించునసిపీటి
సిభక్తి వెసజెందివధూటిని। జెందుడీయుని పరిపాటిని। కొం
డాడుచు। మన దొరకొమరుండు దెలుపనఖండవైభవ। గు
ణమణిగణఖని। హనుమద్వరదుని। భజించి రిలదను జదనుజు
లనయము॥రాజన్య॥ 3 ౧౫

అఠాణరాగము - త్రిపుటతాళము

జనవర్యాఘనశౌర్యా। మందరధైర్యా। వినుమునరహరి
చర్యా। దనుజసుతుగతి దెలసిగురువులు దైత్యవిభుగాంచి।
దుర్జనుసు నీసుతుడనగపిలపించి। బలికెకోపించి।జనవర్యా॥
ఏలరాపసిబాలుడవు। దుశ్శీల నీశవలీలయూగుణమేలవచ్చెరా।
ఓమురా చార వెడకిరా। త్రిభువన। పాలిగెల్చితిరా హరి
యిటు లేల రాడనః తండు గంభీరా। మునసుననిమొ నారా

జనవర్యా॥౧॥ సంచరించి ప్రపంచ మెల్లజయించి మించితి నంచుమరి గణి యించెదెక్కడ గా। అందరియాసిన గా। మదిని మార్గముగా। నార్గురిద్వంచి మదిలో గా। నింద్రియంబుజము ను జయించనైతివి గా। దసి తెలిపెదాగ॥జ॥౨॥ ఇందుగల డీ కనందులేడని సందియమువల దెందువెదకిన నందె హరిగ లడూ। వివరించి చూడు। మించిరాద్రి వృద్రూ। సురముని బృందవందితుడూ। వేదము। లందు విష్ణు వయా। జగత్తానందూ। నీడి చెలియు మనేకడు॥ జనవర్యా॥ ౩॥ పంతమున నిటులెంతొ హాగతిన। యంత్రయానుకి కాంతత్వర పద్యాంతమున పతన డూ। హనుమ ద్వరదుడూ। చింతితప్రదుడూ శ్రీభగవంతుడ వ్యాయుడూ వైరిక్స। శాంతుడగు నసింహుండై యవు డూ। తగియుండెదె ననఘుండు। జనవర్యా॥ ఘనశౌర్యము దాక్షిర్యా। వినుము నరహరిచర్యా॥ ౪॥ ౧౬

నాట రాగము - ఆదితాళము॥

శ్రీనృసింహ గురవేనమః॥

కుంభికుంభకరిణా వినుము విసంభావిత కరుణా॥ భరణా॥ దంభకావన వైరిమవా। రంభమున బలెన్నుతవితనూ సంభవునిగని డింభ కాయని। దంభమున సర్వోపగతుం। డంబో జాక్షు డటంటివి నీవీ స్తంభమునను జూపూ। దంభములేక

దాపూ। హరిపదగుంభ సలిక రేపూ। లెమ్మని। జృంభితకరళ
ర కరవాలము ఝుఠాన ఝుళిపించుచు ఘనదో। స్తంభము
నను గద్దియాడిగి హరిదంత దంతులదర। దంభముగ శుభవద్ది
భంగ భంగసం। రంభముదనరగ లేచి। స్తంభము నెదుటను
జూచి జృంభణమున జెయిజాచి। వ్రేసెను ॥ శంభినీ ॥ ఇటు
లవ్రేసిన వ్రేటుతోడను చటులవహ్నిజ్వాల లావహెను। పటు
తరార్భట పటిమచేతను। భగ్నభగ్ననమూ। ఛటఛగా నిప్పుల
కుప్పలుక్కుట ముగను పిక్కటిలమిక్కిలి। కటిలశకట వరో
ద్భట। భటపటలి। మగ్గగ।నగ్గునగ్గునటుంటులనకంతట చెవ
రి। చిటిలిచిట్లిపడగా। పెటిలిపెట్లిపడగా। నెటనెట। దొటి
లిదొట్లిపడగా నటవి। స్ఫుటతరముగ గగనము జగములు।
ఘుగుల్ఘుగుల్ ఘుగులు కొనగను। మిక్కటముగ స్తంభము
దిక్కటములు గభగభిల్లు గుభగుభిల్లుమనునటుంఫట్ఫటా ఫటా
చ్ఫటాయని। చిటచిట్చిట చిటమనుచు। పెటపెట్పెట పెట
మనుచు పటపట్పట పటమనుచు ॥ పగిలెను ॥ శంభినీ ॥

పగిలినంతట ప్రళయ వేళా। పవనవర్ధిత మేఘ జాలా।
ధిగధ నిఘూర్ణితములచాలా। దెలుపు చందములా। మిగులగను
ఘోర్ఘోర ఘోరారవ। మగణితాంధ కారముగా బలు। పొగలె
గయు బ్రహ్మాండ భాండము। లగల బ్రహ్మేంద్రాది సురుల్।

తగనిలువగ లేకను పరవశుడై। తెగడుచుమదిలో నాదిశులెం
తయుబూనా। గరుడోరగ సిద్ధవిమానా। వళిబెద। రగనసురీ
గర్భములన్నియు। ప్రభిన్నములుగాగ। కలకుల నగముల ప్రతిని
నదములెసగగ। ప్రకట ఘోషమొకటి భీషణత। నెగసెనంత
వింతవింత కాంతులు। భుగభుగభుగభుగమనగా। నిగనిగనిగమ
నగా ధగధగ ధగధగ మనగా। వెడలెను ॥ తుంభినీ। వెడలి
నంత మహాద్భుతంబుల వేడివేడిమి చూపుచూపుల। గడిగి
మిడిమిడి గ్రుడ్లుకోరలు గళగళధ్వనులూ। బడసి వెంబడి నుద్భ
వించెను ప్రజ్వల జ్వాలా నరసింహుడు। సడలెభూతప్రేత।
పైశాచ గణముఖనిఖిలా గ్రహంబులు। తడబడిభూమి ఫలా
యుత ములుగా। ఝుడియుచు నవ్వేరగ। కడు ప్రళయము
లీలగ। చుక్కలు ఝుళుఝుల్లున రాలగ। విభ్రమపడివెడవెడ
దనుజులు గనుగొన భయంకరముగా నిటు తనయొడ। లదర
భక్త రక్షకుడగు వీరాంజనేయ విభుండజేయముగ। తొడరి
హుంకరించి మించినప్పుడు గడగడ పుడమి వడంకగ। కడు
వడి జలనిధు లింకగ। పడమర రవియెర గ్రుంకగ ॥ నవదళ
॥ తుంభినీ ॥

రేగుప్తి రాగం-

వందితాశ్రిత కవీంద్ర పోషణ। ప్రకట కవికలుష శోషణ॥

చండభానుఁడదనగ। నసురపతి గుండె ఝల్లుమనగ। నృసింహు డఖండ వేగమున జనించెతద్ఘన కఠోర నరవికట రూపమున భూ। మండలజనులైనను మరియా। ఖండల ముఖులైనను కం జభ। కాండగుహుడు హరుడు వీరలు। గణించగను నుతించగ లరెవినుము ॥ పండితా ॥ మించువిరుల కమలములు సరిగాం చు పదములు। మకరపుల జ ఋంచు। జంఘలు కరి కరముల నెంచు। నిహదొడలు కటితటము - కాంచన మయ పరిధాన ము। ప్రాంచిత కంధరము। నాభినడు మెంచగ సుందరము। తనుతరము పంచవదన సదనసాను పత్రము। పకపకను నగు విశాలవక్షము। కుంచిత ముఖముల్। విదళిత నక్తంచర సుఖ ముల్। ఖరనఖములు। చంచదతుల శంఖచక్ర యుగశర। శ రాసధర భుజాశతము లమరెను ॥ పండితా ॥

శ్రీరాజిత మణిమయ ఘనకిరహార। వళివళియుత గళ ముసు। మిరికిసల యములను। దిధరముకొరా నలశిఖవలెమి సమిప। లూరెకెరసన వికాసము। హారములను గేరపొడవడ రు కోరలగని తీరు। మహోన్నత మేరుశైలబిలము వా శి నాసిక। మెఱంగు జిగిబిగి తెరంగు రంగుల। దూరముపెంచి। శితశిఖలను। సారెకు మెరసి। తగుకుటిలా। కారచటుల పటల ఘటలునరహరి కరాంతరకరాళముఖ మొనరెను ॥పండితా॥

పట్టుకొనుచున్ మిట్టిపడుచున్ । ద్వంద్వయుద్ధమున ॥ ధా
రుణి ॥ కాంచక భిత్తిదలంచక గురులన్ । సాళువడేగ వలె
ను లంఘించిన సముదంచిత రోషమ్ముదయించన్ । మించు
లశిఖమించూ । బలుకోరల్ । మెరయగ పావక కీలలటంచూ ।
సెంచభయంకరముగ గనుపించూ । పృథుతరసట । లెంతయు
కదువడి ఝుళిపించుచు మెరసీ । దనుజేంద్రుఁడు నివిధ మటుదెల
సి । నదుసుకష్టు షిణించి యురమున్ । జించికరమున్ । ముంచి
శరమున్ । ద్రుంచె నరహరియు ॥ ధారుణి ॥ ౨ ॥ వింతగదా
నవకాంతుని యొడలన్ । బిగించియూడల గోరులనిటులన్ ।
పంతమున దినాంతమునను చించినయంతన్ । చెంతకు వెసతె
చ్చిరి । దనుసంతతి చెలగుచు దాణమ్ము లతనుఁజేరి । మంచు ।
డుగపోరిన గనుగొనివారి । మరిసిజ బహురూపమ్ముల నణచు
సెంతయు కినుకన్ । హనుమద్వరు డెనసిన వెనుకన్ ।
సురులంత హృదంతరములన్ । సంతసములన్ । మంతనములన్ ।
సన్నుతించిరిటు ॥ ధారుణీశ్వర ॥

సురటిరాగం- అటతాళం ॥

వైరిజన సంహారి । నారీ । శౌరి । చారి । శ్రమువినమీ ॥ వా
రీభవభవ వాసవముఖసుర । వారిజాక్షులుచేరి నభంబున ।

నా రెసా రెకు ఘనఘనాఘన। ఘూరరవ గంభీర భేరిభూరిభాం
కారములు జేసిరి। పుష్పవర్షముల పుడుగ రిసిరి ॥ వైరి ॥ సా
రిసాక్షునిన్ను। సంస్తుతించగ నెంతవారము। వరసింహ। దైత్య
వారణ వారణనరసింహ। సర్వదారుణ। దారుణపటుజిహ్మ।
ఖలనివారణ కారణభుజరంహ। శ్రీరామునను విభుదాడిని వి
దళించి। శౌరిమము దయమీరి బోచితి। వారయనిబ్రహ్మేం
ద్ర చంద్రధ। రాదికిన్నర కింపురుష గరు। డోరగామర సిద్ధ
సాధ్యాల పారముగ మునివరులు పొగడెరి ॥ వైరి ॥ ౧ ॥ ఎన్ని
విధముల ప్రసన్నత జెందక।యున్నాదు నీయాన। సామితో చెలి
మి గొన్నట్టి గజయాన। వేమరునిను నే నెన్నెద వినయాన।
శ్రీమహాలక్ష్మి చెన్నుగ నీవైనా। మన్ననతో। గరిమన్నన విన్ను
ని। కన్నతండ్రికి। కనలునుదీర్ఘము। విన్నపంబున తిన్నతిన్నగ
విన్నవించి వరించి పన్నుగ। సన్నుతించి ప్రసన్ను జేయుము
సన్నుతాంగి యటంచు యజుడనె ॥ వైరి ॥ తిన్నగనుదుట
ను। కస్తూరితిలకము। చెన్నుగన మరించి। కాటుక కనుల కిన్నెల
ము గనునుంచి। పరిమళ మిళిత వస్తువులు ధరియించి। విరిద
మ్మికర విన్యస్తము గావించి। అస్తోక నవరత్న। హారభూష
ణముల। విస్తారముగను। స్తటిఘటియించి। కిస్తుల స్తనకుంభ
ముల మృదుహస్తమున బంగరు రంగటు। దుస్తరింపుచు సఖి

మదన మదహ_స్తివలె। తగుసొగసు గాంచెను ॥ వైరి ॥ 3 ॥
హుంకించి దనుజుని బింక మణంచి భ। యంకరుడై మించుస
కల సద్భక్తవ। శంక రత్వము గాంచా। దుస్తర పంకపంక
ము లింకించు। హానుమ ద్వరదుని। హుంకార మెడలించు। సం
కేత భాషల। సరణినూ పురములు శంక లేకను ఝుణ ఝుణ
మ్రోయగ। చంకవన్మణి కింకిణీకర। కరకంకణమ్ములు ఘల్లు
ఘల్లున। పంకజాక్షి యలంకరించుక పొంకముగ నిటువచ్చి
నిలచెను ॥ వైరి ॥

ఆరభి రాగము- ఆట తాళం.

శ్రీమహిత మహీశు భజన జేయువాత మహీశు భజన ॥
శ్రీమహిత ॥ ప్రేమమెరయ సురాసురనుత। భామినీ మణియు
ధీకరయమున స్వామిసన్నిధి జేరియిటులను। సంభ్రమించి తిల
కించుచు భళి। యేమద్భుత మిదినే నెన్నడు। భూమిలో నగను
గొన్నది హరిచె మునుత్రను విన్నది లేదని। యామహిళా ర
త్నము వికలత। మైమరచిమరీ। తామద్రి బెదరీ వేసరచూ జను
శ్రీమహిత ॥ కోలా హల యుతమై ప్రళయ కాలా। యుత
మృణి గగనమణి। లీలా। దనరుఘన వనజవి। పాల నిభమితని
ముఖమూ। జ్వాలలరుద వానలముల। కీలలవలె విలసిలు నత
పరి। పాలనకలితములగుచూపులు। ఫాలచల దలక జాలము.

లును। హాలాహల ధరశూలము సరిబోల జాలు। పృథుబా
హుభృల్లా। ఖీలములగు కోరలనుచు కమ। లాలయ యీలా
గున। బహుభయ కలితమతినై లాలిత నుతినై। చాలగణిం
చిన ॥ ౧ ॥ శ్రీమహిత కాంతాజన తిలకమిటు। నిజకాంతాకృతి
గనుగొని యతని। చెంతానిలువక ప్రకటముగ। భ్రాంతయ
గుచు। నటుజనుచూ। శాంతునరహరి విగ్రహమిది। కామినీజన
సులభవిగ్రహ। మెంతయును గాదనుచు మనమున సంతసమున
భయమ్మునెసగ। నెంతెంతని వచియింతును। కమవింతవింత
యని మంతుగ నతిశాంతుడైన యంతట జేర దలంతు తదంతి
కమునకని। సీతయింతిని చనగా। యంతకడన గాశాంతుల నెపసిన
॥ శ్రీమ ॥ ౨ ॥ శ్రీ సారసముఖి మరలగను। హాసాహసమణచు
వచనవి। లాసాన్వితుడై వరసుచు। వన।జాసనుడు చెలితమతి
నై। వాసవముఖ సురలకె। దలచక భానూరాసుర వరసుతుని
నీసమానుడు గలడె శాంతుని। గా సఖు పుహనుమద్వరదుని
మౌ సజ్జనవరలేంద్రవర। కేసరికేసరి కళదాయని। యాసరసిజ
సంభవడసను। ల్లాసముగ ముకుళిత కరతలుడై। సవినయుండై
తాసరహితుండై వాసిగపొగడెన॥ శ్రీమహితమహాశుభజన॥

కర్ణాట సారంగ- ఆటతాళం.

దండము దశిశాంహా। నీకుసాష్టాంగ దండము నరసింహా

దండమిదే నీదండ సందేవ। నందబాయక బో్రీవునను వేదం డవరదా చండతరలస। ద్దండజాధిప కాండరంహః ॥ దండ ॥ పుండరీక పూజితా। సురచిరనాభీ। పుండరీక రాజితా। చం డిదండోద్దండ నిజభుజదండ మండిత కుండలాగ్ర విఖండితా హితమండలా। బ్రహ్మాండ పిచండిలా॥ దండము ॥ పండితజన పోషా। కల్మషశోష। భండనపటురోష। కాండభవకాండజాబ్జ ఖండశిఖండ డిండీరాండజేశ్వర। కాండపాండు రకీర్తియుత దిక్తండమణిమయ కుండలాదండము॥ దండమునొనరించి। యు టుభక్త జనవర్యుండు వేడినగాంచి। నిండుకృప హనుమద్వ రుండు ఘ। నుండుమెండుగ నభయహస్తము। దండినొసనఖం డదరణీ। మండలేంద్ర యతండుబాగడెక ॥దండము దళితాం హసీకు సాష్టాంగ దండము ॥ ౨ ॥

## భూపాల రాగం- జంపె తాళం.

భూపాలాయను రాగముతో। పాసగగ వినుసమ్మతితో। శ్రీపతిసంస్తుతి మహితో ద్దీపితనిర్మల మతితో। పాలయమాం కమలాక్షా। భక్తజనావనదీక్షా । లాలితకరుణాకటాక్షా। శుభ లక్షణ నరహర్యక్షా। లోలతరేంద్రియ శిక్షా। లోకగణాధ్య క్షా । శ్రీలలనాయుతవక్షా। యనాశ్రిత జన సంరక్షా॥భూపా॥ పాహిఖగస్కాధహరే। పావనచిత్రాబ్జహరే। పాహిపదాననమి

తహారె మాంపాహి సదానృహరెపాహిఘనాఘసమీరహరె పాహివిహంగేంద్రహరె, పాహితమోహరణహరె। యనివ ర్ణించెముదమలరె॥ భూ పా ॥ రత్నమయమాంఘనశీలా। రంజిత కాంచనచేలా। మోక్షఫలప్రదఖేలాజగ। న్మోహనకీర్తివిశాలా దక్షరమాపరిపాలా। ధర్మజయాలవాలా। వీక్షణభయంకర కరవాలాయని వినుతించెగా చాగా॥ భూపాలా॥ వందేహం బహుశాంతం। భవ్యఘనౌఘనిశాంతం। మందరధైర్యలసంతం। నిగ। మాంతగిరాంసిద్ధాంతం। వందిజనైరత్యంతం। వందితమా యితదాంతం। మందారంనమాం।తం। త్వామనియెర్చెగహరి చెంతగ॥ భూ। దూరితసన్మునివిపదం। వీరహనూమద్వరదం। వైరిసరోజద్విరదం। ఘృణి। వారితశారదశరదం। దోరవిభా ధవళరదం। హృదికలశౌవరదం। ఘోరమదానురవరద।మ్మని। కొనియాడెగసిరులొందగ॥ భూపాలా॥ .

నీలాంబరి రాగం- ఆదితాళం

ననుమన్నింపవె। నినువెరనమ్మితి। దనుజాంతక నరసింహా। వినమముననునే। వనయముచేసిన। విన రాదానరసింహా॥అతు లకృపావన। కృతయాతిపావన। పతితపావన నరసింహా। ఫల। యుతసేవన నరసింహా॥ శృతిపథతేవన। హితమతిభావన। నతజీవన నరసింహా। ॥ననుమ। సుగుణ గణారామా। అగవా

హనోద్ధామ । అగణితధామా నరసింహ । పంనగశయనా నరశింహానగజావినుతనామునవతులశీధామ । జగదభిరామా నరసింహా॥నను ॥ ఖరతరమూనీ । నరసింహాకృతికి । వెరువను శ్రీనరసింహా। నినునే । మరువను శ్రీనరసింహా। దరిలేనిసంసార దావాగ్నినిజేర। వెరతును శ్రీనరసింహా॥నను॥వినుమవతరించిన। పనిచీరెకోపమున। పసిలేదిక నరసింహా। వొంతనివేడుదు నరసింహ। వినతులబోవవే। వెసదయజూడవె। మునుపెవరిని నరసింహా॥ నను॥అని ప్రహ్లాదుడు।వినుతిజేయనపుడు।ఘనవిక్రమ నరసింహ। యిది।వినుమీభూవరసింహా।హనుమద్వరుడా వెను కప్రసన్నుడామెనుశాత్రవజగసింహ॥ననువున్నంచవెనినునెర నమ్మితి। దనుజాంతక నరసింహ ॥

## సౌరాష్ట్రరాగం॥ ఆటతాళం

భూనాయక వినుమీకథా రసమూ। బుధజనకర్ణసుధార సమూ। దానవసుతుడెంతయు బహువిధముల। పూనినవేదు కపొడమినగనినీ । జ్ఞానమునకు మెచ్చితినినను। సకలవరముల నొసగుమనినద। యానిధేనీపాదకమల। ధ్యానమున కితరంబు వలదనె॥ భూనాయ ॥ ఘనుడైననీభక్త। జనుడైకలుషవర్జనుడై పరమపావనుడై। ముక్తిగనక మిక్కిలిదుర్జనుడై। భవ। ద్విన తదైవతశాసనుడై। నాదుజనకు డడరెదుర్వ్యసనుడై। అటు

ల| గనుక| పవిత్రుని మొనరింపుమనిన విని| మనుజకేసరిని గనుట సద్గతులను| గనకపోవునె కనకకసిపుదుచనక మన్వంతరము వెల్లను| దనుజపతివై మనమునగమనము| న్ముదము నబొందవెనతడును ॥ భూనాయిక ॥శృంగారము తెలయంగా| భేరీమృదంగాదులు మోయంగా| శుభమంగళ వరము లెసంగా| లక్ష్మీ| హంగుగ మదువులాసంగా| సురసారంగ గమనలలరంగా| ధవళ| రంగదుభయచామ| రంబులు వీవంగా| సంగీతము| కిన్నరాంగనలు పాడంగా| పొంగుచును ముని పుంగవులు పొగ| డంగ ప్రహ్లాదుడును రంగుగ| చెంగటను కొలువంగ మదివన| శ్రీవరహరి చెలంగెను। భూనాయిక ॥ సరసీరుహ భవుడరసీ| ప్రహ్లాదునివరశీతల దృష్టి మెసీ|భూ| సురమాళి మనులలో గలసీ| వాని| హరిభక్తి వైఖరి దెలసీ| భాసురహర్ష భరమున వెలసీ॥ తగను| ర్వయుందుసొగసొ| రాష్ట్రాభిషేకము| శిరిమీగ జేసెను| కరుణావిషేకము మెరయగ| హనుమద్వరప్రదుచరితమును| వినినవారి చిర| నవలుసిరులను గాంతురని సుమీ| చిరముగను శ్రీశుకుఉపలికెను॥ భూనాయక ॥

యదుకులకాంబోజి రాగం- ఆదితాళం.

నేకృతార్థుడనైతిని దేవా| నిర్మలస్వభావా| శ్రీకరమై

ముని పంజరలోకన । శ్రీకరమైనత సజ్జననిత్య శుభాకరమై ।
కలుషాంధకార రవి। భాకరమైరిపు భీకరమై। పాతకటసుమ
ధురమై। లలితాస్తోత్రమోక్షకరమై। తగుపమ। త్రైకముకుంద
పదారవిందమక। రందబిందు బృంద మందినందుల। నేకృ॥
బల్లిదుండైన హిరణ్యకశిపుడు। ఇలముపిక్కటిల్లా। సురులను
భీ తిల్లితెల్లపిల్ల। కులశైలములెల్ల పెల్లగిల్లా। దిక్కులు। కొల్ల
లాడి విలపిల్లుచు। హల్లకల్లోలముల మెలంగినవాని। తృళ్లగ
గించిరహాల్లిన। నరహరి। మొల్లమైన కథనుజెప్పి ప్రమదస।
ముల్లసముననేసిదుమదాద వల్లరిలెం గో, సీ। కలుషము। లల్లన
దుల్లగ మెల్లమెల్లనా।యుల్లమెల్లయుల్లసిల్ల జేయుట॥నేకృత॥
పదపతిప హిగో దోహనమాత్రము। పదమునిల్పవైనా। డెల్పి
తవిప్రేమ। మదినిదనరెగాన। అష్టాంగయోగా। స్పదసుధీని
ధానా। సకల। త్రిదశదుర్లభ మపవర్గముకర। ఉదరసమాన
ముగా గనువెలసిన। సదయహృదయనీదు పాదసేవ। సదను
కోరముదముమీరి యుండుట। చిదచిద్భావమా। నిత్యచిర
తరకామితమా। నఖండ। పదవిమహోన్నత పదవిగఘున।
పదవిపదవి భిదురభిదురగుణభర ॥ నెకృ॥ బంధచిత్ర సబం
ధవిచిత్ర ప। బంధములొనరించి। ఘటికాశతగ్రంథ యనగ
మించి। శతఘంటస। బంధకవితగాంచి। ప్రబలు। వసుంధరలో
పట్టాధిరాయకవి। సుతుడౌహనుమద్వర పాలితకవి। సింధుర

రామస్వామి మొనర్చిన శ్రీభాగవత గ్రంథసప్తమ। సకీర్తనములు। సరస। జ్ఞానవర్తనములు। నవరసబంధురములు। హనుమద్వరదాంకిత। భవ్యదివ్యదివ్య భావ్యములవిని ॥ నెక్క ॥

కళ్యాణిరాగం ॥ ఆదితాళం ॥

మంగళమిదె జయమంగళ మహిత విభంగమహిత నరసింహా। మముసంగతినేలు నృసింహా। మునిపుంగవనుత నరసింహా। కదురంగలరిన నరసింహా। లక్ష్మీనరసింహా॥ మంగళం॥ ప్రతతజ్వాలా హేబల నామవిభాసుర క్రోడనృసింహా।బుధహిత కారుణ్యనృసింహా। సుచరితభార్గవ నృసింహా।విశ్రుత పావన నృసింహా। శ్రీనారసింహా ॥ మంగళం ॥ దనరినయోగానంద మహాభక్తవత్సనృసింహా సుశీలా। రుచిఘనతరకాంచనచేలా। శ్రీహనుమత్పాలనశీలా। సద్గుణయుతకీర్తి విశాలా। శ్రీలక్ష్మీలోలా। మంగళం॥ సారచతుర్వింశతి కీర్తనమణిహారము నిచ్చితి మీకీ।బలుపేరుగదాల్చు మురారి। అని।వారిలి దురితవిదారీ। అలూరి పురీంద్ర విహారీ। శ్రీరంగశౌరి మంగళం

శ్రీమద్వీర హనుమతేనమః॥

ఉ. ఒప్పులకుప్పనందగు మహోన్నతకీర్తనరత్న హారమే। నప్పనజేసితిన్ ఘన దయామతి పేరుగజేసి దాల్చినీ।విప్పుడు తప్పులొప్పులని తెంచకు। శ్రీహనుమత్కటాక్షముల్। చెప్పినరీతి జెప్పితిని శ్రీఫలవాయక రంగనాయకా॥

శ్రీనృసింహాశ్రణమస్తు॥

పంతువిరాళి ఆటతాళం

వీరనారసింహా మంగళం। దేవదేవ విబుధ జననుతంహా మంగళం॥ ధీ॥ వీర నారసింహా వైరి మదగజేంద్రసింహా। ఘోర నరకరాశి జిహ్వా। కుటిలకలుష హరణరంహా। వీరనారసింహా మంగళం॥ మదముతోడను దక్షియందు। మొదలు వేదహానజ యించి। మొదలిచదువులజున కొసగి। ముదముపొందు మీనరూపా।వీరనారసింహా। సుందరముగదేవదనుజులందబ్ధితరువదిగు వ, మందరమనుబూని యమృతమొందజేయు కూర్మరూప॥ నారసింహా॥ కుటిల కనకనయనజించి, కోరనధరింధరించి ఘుటిత ఘుఘుర్ఘురాగ్ర్భటులను నటనలిడు వరాహరూప॥ వీర నారసింహా॥ మంగళం॥ కరములను హిరణ్యకశిపు నురము జించి। దానిసుతుని। కరుణ వేలి వరమొసంగు వరమపావన స్వరూప॥ వీరనారసింహా॥ మించి బలినణంచి నృపులదృంచి ప వనత్రిసుగాయు పాలించి। హాలముగాంచి। జపమునించి వెలయు కల్కిరూప॥ వీరనారసింహా॥

తోడిరాగం॥

శ్రీరామచంద్రునకు హారతివ్వరె॥ మంగళహారతివ్వరె॥ కుం దరవదనలార ఆనందకరముగ। అందముగను పాటపాడి హాయి మీరగ॥ శ్రీరామ॥ గరుడగంధర్వ కింపురుషులాదిగ। సురలు నారదాదాది మునులు స్తుతులుచేయగా। శ్రీరామ॥ ఘనతరముగ

శబ్ద చిత్రగతులు మెరయగా। కనులపండువుగను వారకా
లాడగా॥ శ్రీ రామ॥ ఘనతరముగ వందిమాగధులుపొగడ
జనకసుతనుగూడి మహోత్సవము జెందగా ॥ శ్రీరామ ॥ కి
నట్టిజనుల కోర్కెల కొనలుసాగగా। వీరహనూమద్వారుడై
యుచుండగా॥ శ్రీ రామ ॥

సురరాగం॥

నీముద్దు పాదములకు నిత్యమంగళ । శ్రీమనోద్భ లంభర
భకర నరసింహ। దేవశ్రీ మహానుభావ। నీముద్దు ॥ వేదశే
పరమపురుష మురహర విమల కమల నేత్రా। సుహృదా
దహృదయ సదయ సాధుపోషణ। మునినుతచారిత్ర ॥ బ్రది
యునుచు। మనీ పాదములసేవలకు॥ మజ రాష్ట్రమైన బ్ర
దునశక్తి సమ్మోదమొసగితొరవిలసితకరపల్లవయుగ నీముద్దు॥
అందుగలవు ఇందు లేవటంచును। సందియు బునొందు। వల
వదు నెందుజూడ నందెగలదు। హృదానందుడట్టి మయిమ
ముందిశేశుడనగా వినిదనుజేంద్రుడాత్మ చలగా। శ్రీవ అంత
చూపుమనగా । సుకుక్షికంభమునందు వెడలినట్టి నర
వగునిను వి..తించెద ॥ నీముద్దు ॥ హర చతుర్ముఖామల
నీకృప। నంవరానియొడకు । దనుజేశ్వరుని సుతుని వినుతి
బొప్పిచిత। వరుదుగనేనరుననుశిరులుతగసుచర్యడగు శ్రీ।
ఖిఅప్పయార్య్య వనిశము కరుణనేలుస్వామి స్వర్ణ వెంకట
కవినుత॥ నీముద్దు ॥ సంపూర్ణము॥

